శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః



# గోదోపమాష్టకమ్, కృష్ణాష్టకమ్ - సవ్యాఖ్యానమ్




**వ్యాఖ్యాత:**

'పండిత రత్న' ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు

**సంపాదకుడు:** ఈయుణ్ణి అనంత రంగ రామన్


**ప్లవ నామ సంవత్సరం, దీపావళి - 04-11-2021**

దీపావళి పండుగ సందర్భంగా భాగవతగోష్ఠికి ఈ చిరు గ్రంథం సమర్పింపబడుతున్నది

# గోదోపమాష్టకమ్ - సవ్యాఖ్యానమ్

శ్రియః పతి అయిన శ్రీమన్నారాయణునకు ఐదు దశలు ఉన్నాయని సంస్కృతవేదం, ద్రవిడవేదం తెలుపుతున్నవి. ఆ దశలలో **"పిన్నానార్ వణంగుమ్ శోది"** (అవతారాలకు వెనుకబడినవారు కొలిచే జ్యోతి) అని తిరుమంగై ఆళ్వార్ల చేత కీర్తింపబడిన అర్చావతారమే గొప్పది. **"అదిలే తేంగిన మడుక్కళ్ పోలే అర్చావతారమ్"** (అందులో తేట పడిన మడుగులవంటివి అర్చావతారాలు) అని శ్రీ పిళ్ళైలోకాచార్యులవారు కూడా భగవదవతారాలను కొనియాడారు. భగవంతుడు ఎప్పుడు అవతరించినా లక్ష్మీసహితుడుగానే అవతరిస్తాడు. భగవంతుడు అవతరించేటపుడు లక్ష్మీదేవితో పాటు అవతరించకపోయి ఉంటే ఆ అవతారమే భోగ్యంగా ఉండి ఉండదు – అని అంటారు, శ్రీ పరాశర భట్టర్. ఈ భావాన్ని వారు శ్రీ గుణరత్నకోశం అనే స్తుతిలోని **"యది మనుజతిరశ్చాం లీలయా తుల్యవృత్తేః అనుజనురసురూపా దేవి! నావాతరిష్యః, అసరసమభవిష్యత్"** అనే శ్లోకంలో వ్యక్తం జేశారు. **"రాఘవత్వేఽభవత్ సీతా రుక్మిణీ కృష్ణజన్మని"** (శ్రీరామావతారంలో సీతగా, శ్రీకృష్ణావతారంలో రుక్మిణిగా లక్ష్మీదేవి అవతరించింది) అని పరాశర మహర్షి విష్ణుపురాణంలో తెలిపారు. వరాహావతారంలో భూదేవి, శ్రీరామావతారంలో సీతాదేవి ,శ్రీ కృష్ణావతారంలో రుక్మిణి, నీళాదేవి ప్రధాన దేవేరులు. ఆవిధంగానే అర్చావతారంలో గోదాదేవి ప్రధాన మహిషి.

గోదాదేవి వైభవాన్ని వర్ణించే కృతులు అనేకం ఉన్నాయి. **గోదాపరిణయచంపువు, గోదాగుణ రత్నకోశం, గోదా అష్టోత్తర శతనామస్తోత్రం, గోదాచతుఃశ్లోకి, గోదోపమాష్టకం, గోదాచూర్ణిక** మొదలైనవి వాటిలో కొన్ని. ఇవి అన్నీ సంస్కృతంలో రచింపబడ్డాయి.

**శ్రీవిల్లిపుత్తూర్** క్షేత్రంలో మార్గశీర్ష మాసం చివరలో శ్రీ గోదాదేవికి నీరాట్టోత్సవం చాలా వైభవంగా ఈనాటికీ జరుగుతుంది. **తిరుమూక్కుళమ్** అనే కోనేటి తీరంలో ఈ ఉత్సవ జరిగే మండపం ఈనాటికీ మనకు దర్శనమిస్తుంది. విశేషమైన ఉపచారాలతో గోదాదేవికి



శ్రీకృష్ణస్వామితో పాటు **ఎణ్ణెయ్ క్కాప్పు (వంటికి తైలన్ని పూయుట)** సమర్పింపబడుతుంది. తరువాత కోనేటిలో నీరాట్టోత్సవం జరుగుతుంది. ఆ సమయంలో **గోదోపమాష్టకం** ఒక్కొక్కనాడు ఒక్కొక్క శ్లోకాన్ని వ్యాఖ్యానంతో పాటు **వేదప్పిరాన్ భట్టర్** అనేవారు తిరుమంజన సమయంలో విన్నపిస్తారు. ఈ స్తోత్రాన్ని రచించిన కవి ఎవరో తెలియదు. పెరియాళ్వార్ వంశానికి సంబంధించినవారుగా చెప్పబడే, **వేదప్పిరాన్ భట్టర్** అనే పేరుతో వెలిగే **కేశవకవిరాజు**చే బహుశః ఇది రచింపబడి ఉండవచ్చు.

## 1) హంసతో సామ్యం:

సన్మానపాబ్జప్రవణాం సారాసారవివేకినీమ్,

సద్గతిం శుద్ధరూపాం తాం గోదే! హంసీం ప్రచక్షతే.

గోదాదేవీ! నీవు ఒక హంసగా చెప్పబడుతున్నావు. హంస శుద్ధమైన తామరపూవులో నివసిస్తుంది. హంస పాలను, నీటిని వేరు చేసే అసారమైన నీటిని తొలగించి, సారమైన పాలను గ్రహిస్తుంది. హంస నడకలు చాలా అందంగా ఉంటాయి. అంతేకాక, పవిత్రమైన తెల్లని రంగును కలిగి ఉంటుంది.

నీవు కూడా సత్పురుషుల మనసులో సదా నివసిస్తావు. సాధువులు నిన్ను ఎల్లప్పుడూ మనసులో నిలుపుకొని స్తుతిస్తారు. వేదశాస్త్రేతిహాస పురాణాలలో అసారం, అల్ప సారం, సారం, సారతరం, సారతమం అని పలు రీతులలో విషయాలు ఉంటాయి. నీవు వాటిలో సారతరమైన విషయాలను మాత్రమే గ్రహించి, మిగిలిన వాటిని వేరు చేసి, సారతమప్రబంధాలను అనుగ్రహించావు. నీవు హంసలకు కూడా అందమైన నడకలను నేర్పుతున్నావు. చక్కని నడకలను తెలిసినదానవు కదా నీవు. ఇంతేకాక నీవు శుద్ధసత్వగుణాన్ని కలిగినదానవు. అందువల్లనే విజ్ఞులు నిన్ను హంసగా పలుకుతున్నారు.

## 2) మణితో సామ్యం:

**తేజోమయస్వరూపతత్వాత్ శ్రీమత్సేవితవైభవాత్,**
**చింతామణిసమా గోదే దేశికైః త్వమిహోచ్యతే.**

గోదాదేవీ! ఆచార్యవర్యులచే నీవు చింతామణిగా కీర్తింపబడుతున్నావు. మణి కాంతిమయమైన స్వరూపాన్ని కలిగి ఉంటుంది. భగవంతునిచే వక్షఃస్థలంలో ధరింపబడే గొప్పతనాన్ని కలిగి ఉంటుంది. కోరినవారికి కోరినవానిని అన్నిటిని ఇవ్వగలిగి ఉంటుంది.

నీవు కూడా **"దూర్వాదలప్రతిమయా తవ దేహకాంత్యా"** అని దేశికులు స్తుతించినట్లు గరికపోచ రంగు వంటి రంగును కలిగినదానవు. భగవంతునకు కూడా శోభను కలిగించేదానవై, తేజోమయురాలవై వెలుగుతున్నావు. భగవంతునకు కుడివైపున మహాలక్ష్మి ఉన్నట్లే, ఎడమ పక్కన నీవు వేంచేసి ఉండి, ఆ స్వామికి ఆనందాన్ని కలిగించే గొప్పతనాన్ని కలిగి ఉన్నావు. **"నీంగాద**

**శెల్వమ్ నిఱైందు**" అని, "**ఎంగుమ్ తిరువరుళ్ పెఱ్ఱు మకిழ்వర్**" అనే నీ సూక్తులు మూలంగా కోరినవారికి కోరినవాటిని అన్నిటిని ఇస్తున్నావు. ఇటువంటి  నిన్ను ఆచార్యులు చింతామణిగా పలకడం చాలా తగినది.

## 3) కల్పవృక్షంతో సామ్యం:

**అనేకశాఖోజ్జ్వలితస్వరూపాత్ అనంతభోగిప్రియవర్ధకత్వాత్,**
**సురేశభూషాసుమనః ప్రదానాత్ సురద్రుమేనాసి సమాద్య గోదే.**

అమ్మా! గోదాదేవీ!  దేవలోకంలో ఉండే  కల్పవృక్షంతో సమానంగా నీవు వెలుగున్నావు. కల్పవృక్షం అనేది పలు పలు శాఖలను కలిగి ఉన్నది. గొప్ప కాంతిని కలిగినది. అనేక విధాలైన సుఖాలను వాటిని  అనుభవించాలని ఆశ పడేవారికి ఆయా సుఖాలను కలిగించి, ఇంకా ఇంకా ఆనందాన్ని కలిగిస్తుంది. దేవేంద్రుడు, శచీదేవి మిక్కిలి ఆశపడిన పుష్పాలను ఇస్తుంది.

నీవు కూడా, ఆ విధంగానే, కల్పవృక్షంవలె పలు పలు శాఖలను కలిగిన వేదంలోని సారంగా ప్రకాశించే **తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొழி** అనే ప్రబంధాలను అనుగ్రహించి లోకంలో అంతటా కీర్తితో వెలుగుతున్నావు. ఆదిశేషుడు అనే పడకపై పరుండి ఉండే భగవంతునకు ప్రియాన్ని ఇంకా ఇంకా వృద్ధి చేసేదానవై ఉన్నావు. నిత్యసూరులకు నాధుడైన భగవంతుడు కూడా ఆశపడి అలంకరించుకునే రీతిలో అలంకరించుకున్నావు. అందుచేత నీవు కల్పవృక్షంతో సమానమైనదానవు.

## 4) సూర్యునితో సామ్యం:

**సద్గోవిలాసేన తమోహరత్వాచ్ సమస్తసద్వందితమండలత్వాత్,**
**పద్మానసౌజ్జ్వల్యకరప్రభావాత్ భాసీహ గోదే! రవితుల్యశీలా.**

గోదాదేవీ! నీవు సూర్యునితో సమానంగా మిక్కిలి కాంతిని కలిగినదానవై వెలుగున్నావు. సూర్యుడు **"కదిరాయిరమిరవి"** (వేయి కిరణాలను కల సూర్యుడు) అని కీర్తింపబడేవాడై, వేయి కిరణాలను కలవాడై వెలుగుతున్నాడు. లోకంలో ఉండే బాహ్యాంధకారాన్ని అంతటినీ పోగుడుతున్నాడు. లోకంలో ఉండే సజ్జనులు అందరిచే సంధ్యా సమయాలలో నమస్కరింపబడే మండలాన్ని కలవాడై ఉన్నాడు. తామర పువ్వులను అన్నిటిని తన కిరణాలతో వికసింపజేస్తున్నాడు.

అయితే, సూర్యుడు బయటి చీకటిని మాత్రమే ఉన్నాడు పోగొట్టగలుగుతున్నాడు. నీవు వేదానికంతటికీ విత్తనం వంటి **తిరుప్పావై** ప్రబంధాన్ని, **నాచ్చియార్ తిరుమొழி** ప్రబంధాన్ని అనుగ్రహించి, లోకంలో ఉండే అజ్ఞానమనే చీకటిని కూడా పూర్తిగా అంతరింపజేస్తున్నావు. లోకంలో ఉండే సజ్జనులు అందరూ సదా నమస్కరించే తేజోమండలాన్ని కలిగినదానవై ఉన్నావు. అంతే కాక, నీవు అవతరించిన పాండ్యమండలం పేరు వినగానే సజ్జనులు అందరూ చేతులెత్తి నమస్కరిస్తారు. తామర పువ్వువంటి ముఖం కలిగిన భగవంతునకు గొప్ప ఆనందాన్ని కలిగించి, దానివల్ల **"అప్రమేయం హి తత్తేజః"** అని చెప్పేవిధంగా ఆ భగవంతుని ముఖమనే తామర పువ్వును వికసించేటట్లు చేస్తున్నావు. ఈ విధంగా నీవు అన్ని విధాలా సూర్యునితో పోలి ఉన్నావు.

## 5) చంద్రునితో సామ్యం:

**కళాత్మకత్వాత్ కమలాత్మకత్వాత్ భవార్తితాపక్షపణస్వశైత్యాత్,**
**సదా మహావిష్ణుపదానుషంగాత్ హిమాంశుతుల్యా త్వమిహాసి గోదే.**

గోదాదేవీ! నీవు చంద్రునితో సమానంగా వెలుగుతున్నావు. చంద్రుడు పదహారు కళలు అనే సంపదను కలిగినవాడై వెలుగుతున్నాడు. (**"సలిలం కమలం జలమ్"** అనే విధంగా కమలం అంటే జలం అని కూడా అర్థం). జలమయమైన సముద్రాన్ని చిలికినప్పుడు పుట్టినవాడు చంద్రుడు. అందువల్లనే అతడు జలంవలె తెల్లని స్వభావం కలిగినవాడు. అతడు భూమిలో పుట్టిన మానవుల

శరీరంలోని తాపాన్ని, మనసులోని తాపాన్ని తన కిరణాలతో పోగొడతాడు. అన్ని కాలాలలోనూ ఆకాశాన్ని తనకు నివాసంగా కలిగి ఉంటాడు.

గోదాదేవీ! నీవు అరవై నాలుగు కళలను తెలిసినదానవు. **"దేవి! త్వాం సహ నీళయా సహ మహీ దేవ్య స్సహస్రం తథా యాభిస్త్వం స్తనబాహుదృష్టిభిరివ" (శ్రీగుణరత్నకోశమ్—26)** అని పరాశర భట్టర్ పలికినట్లుగా కమల అనబడే శ్రీమహాలక్ష్మికి అవయవభూతగా ఉన్నావు. నీ కరుణ నిండిన చల్లని కటాక్షాలతో సంసారతాపంతో బాధపడే జీవులకు ఆ బాధను అంతటినీ పోగొడుతున్నావు. ఎల్లప్పుడూ మహావిష్ణువు యొక్క పాదారవిందాలను ఆశ్రయించి ఉన్నావు. అందువల్ల, గోదాదేవీ! నీవు చంద్రునితో పోలి ఉన్నావు.

## ౬) చిలుకతో సామ్యం:

**శ్యామాం ద్విజాధిపసుతాం శ్రవణాభిరామాం మంజుస్వనాం మదనమీశ్వరజం భజంతీమ్,**
**గోదే! గురో స్త్రిజగతాం గుణశాలినీం త్వాం లీలాశుకీం కృతధియః సముదాహరంతి.**

గోదాదేవీ! గొప్ప జ్ఞానాన్ని కలిగిన మహనీయులు నిన్ను లీలాశుకంగా పలుకుతున్నారు. చిలుక పసుపు పచ్చని రంగును కలిగి ఉంటుంది. పక్షికి ద్విజమని పేరు. ఇటువంటి పక్షులకు ప్రభువు గరుడుడు. చిలుక కూడా పక్షి జాతికి చెందిన అయినందున గరుడునకు కూతురుగా చెప్పబడుతున్నది. చిలుక చెవులకు మధురంగా ఉండే , అందమైన స్వరాన్ని కలిగినది. శ్రీమన్నారాయణుని కుమారుడైన మన్మథుని ఆశ్రయించి అతనికి వాహనంగా చిలుక వెలుగుతున్నది.

గోదాదేవి, చిలుకవలెనే, పచ్చని వర్ణాన్ని కలిగినది. బ్రాహ్మణులకు అధిపతి అయిన విష్ణుచిత్తులకు కుమార్తె. చెవులకు ఇంపైన తిరుప్పావై ప్రబంధాన్ని పాడినది. లక్ష్మీపతి పుత్రుడైన మన్మథుని **"తైయొరు తింగళుమ్"** అనే దశకంలో మన్మధుని ఆశ్రయించింది. మన్మథునకే మన్మథుడు అయిన శ్రీకృష్ణుని స్తుతించింది. భగవద్గీతను పలికి ముల్లోకాలలో

జగద్గురు అని వాసుదేవుని కూడా తిరుప్పావై ఆనందింపజేసే గుణాలను నిండుగా కలిగిన చిలుక గోదాదేవి. శ్రీకృష్ణుని గుణాలనే పాడిన శుకమహర్షితోకూడా ఈమె సాటి వస్తుంది.

## 7) కామధేనువుతో సామ్యం:

**వృషప్రియాం విశ్వజనాఖిలార్థం విశ్రాణనోత్కాం విధివాసవేద్యామ్,**
**శ్రుతిప్రసన్నాం సురభిం విశంకే స్వస్థాం మఖార్హాం భవతీం తు గోదే!.**

తల్లీ! గోదాదేవీ! నిన్ను నేను కామధేనువుగా తలుస్తున్నాను. "**వృష—సేచనే**" అనే ధాతువు ప్రకారం, **వృష** శబ్దానికి తడిపేది అనేది అర్థం. "**వర్షతీతి వృషః**" అని, లోకాన్ని అంతటినీ వర్షం కురిపించి చల్లబరిచేవాడు, ఇంద్రుడు. ఈ ఇంద్రుని విషయంలో ప్రీతిని కలిగినది **సురభి** అనే కామధేనువు. **విశ్రాణనమ్** అని అంటే గొప్ప దాన గుణం. కోరినవారికి కోరిన విషయాన్ని ఎక్కువగా ఇచ్చే గుణం. **ఉత్కా** అంటే ఆ గుణంలో చాలా ఆశ కలిగి ఉండడం. అందువల్ల, కేమధేనువు పక్షంలో "**విశ్రాణనోత్కా**" అనేది — కామధేనువు చాలా ఔదార్యాన్ని కలిగినది అనే అర్థాన్ని ఇస్తుంది. అందువల్ల కామధేనువు గొప్ప దానగుణాన్ని కలిగినదై, అడిగినవారికి అడిగిన కోరికను అంతటినీ ఇవ్వడంలో ఆశ కలిగినది అనే అర్థం ఇక్కడ వస్తుంది. ఐహికఫలాలను ఇవ్వడం ద్వారా కామ్యశ్రుతిలో జనులకు విశ్వాసాన్ని కలిగించి, ఆ శ్రుతిని ప్రకాశింప చేస్తున్నది, కామదేనువు. "**శ్రుతిం ప్రసన్నయతీతి శ్రుతిప్రసన్నా**" అనే అర్థాన్ని ఇక్కడ శ్రుతిప్రసన్నశబ్దానికి చెప్పుకోవాలి. **స్వః** అంటే స్వర్గం. **స్వః తిష్ఠతీతి స్వస్థా** – స్వర్గంలో ఉండేది అని అర్థం. కామధేనువు స్వర్గంలో ఉంటుంది కదా. "**మఖార్హామ్**" అంటే — యాగానికి కావలసిన పాలు, నెయ్యి మొదలైన ద్రవ్యాలను ఇస్తున్నందున యాగం చేసేవారిచే ఆదరింపబడేది, కామధేనువు అని అర్థం. ఇది కామదేనువు విషయంలోని వివరణ.

గోదాదేవి విషయంలో వివరణ ఏ విధంగా అంటే—వృషభంవంటి గంభీరమైన నడకను కలిగిన కృష్ణుని విషయంలో గోదాదేవి ప్రీతిని కలిగినది. ఆమె వృషాప్రియ. "**వృషప్రియం యస్యాః**

**సా వృషప్రియా"** అనే వ్యుత్పత్తిని ఇక్కడ చెప్పుకోవాలి. భూలోకంలో నివసించే చేతనులకందరికి వారు వారు కోరే పురుషార్థాలను అన్నిటినీ ఇవ్వాలి అనే కోరిక కలిగినది, గోదాదేవి. ఆమె భూదేవి అవతారమే కనుక, బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలచే స్తుతింపబడుతున్నది. వేదానికి అంతటికీ విత్తువంటి **"కోదై తమిழ்"** అని పొగడబడే తన ప్రబంధాల ద్వారా స్పష్టంగా తెలిపినందున, వేదాన్ని ఆమె ప్రకాశింపజేసింది. తనకు స్వర్గంగా ఉండేది భర్త సన్నిధిలో ఆమె ఉంటుంది. **"పత్నీ యజ్ఞసంయోగే"** అనే విధంగా ఈమె విష్ణుపత్ని కనుక, యాగాలలో పూజించదగినది. అందుచేత గోదాదేవి కామదేనువుతో సామ్యాన్ని కలిగి ఉన్నది.

## 8) నీరాట్టోత్సవప్రయోజనం:

**గోదే! స్నాతాసి మాతః!త్వమిహ నిగమశాస్త్రోక్తమంత్రక్రియాభ్యాం**
**ఏతేనైవాతిపాపా వయమిహ సకలా ముక్తపాపా భవామః,**
**లోకే దృష్టశ్చ కర్మేదృశమిహ సకలైః స్వప్రజారోగశాంత్యై**
**మాతా పీత్వా కషాయం తనయమథ నిజస్తన్యదానేన పాతి.**

ఈ భూమికి అంతటికీ తల్లి అయిన గోదాదేవీ! వేదాలలో చెప్పబడిన మంత్రాలు, క్రియలు అనే వీటిని అనుసరించి నీ తిరుమంజనోత్సవం జరుగుతున్నది. నీవు ఈ విధంగా స్నానమాడడం వల్ల చాలా పాపాలను చేసిన మేమంతా కూడా అన్ని విధాలైన పాపాల నుండి విముక్తులము అవుతున్నాము. స్నానం చేస్తున్నది నీవు, పాపాలు తొలగిపోతున్నది మాకు! ఇది ఏ విధంగా పొసగుతుంది? అని అంటే, లోకంలో ఈ ప్రక్రియను స్పష్టంగా చూస్తున్నాము. బిడ్డకు ఏదైనా రోగం వస్తే, ఆ వ్యాధి తీరడం కోసం, ఆ బిడ్డ తల్లి తాను ముందుగా కషాయం మొదలైన మందులను తాగుతుంది. తరువాత తన స్తన్యాన్ని ఆ బిడ్డకు ఇచ్చి తద్వారా ఆ బిడ్డకు కలిగిన రోగాన్ని తీర్చి కాపాడుతుంది. ఆ విధంగానే లోకమాత అయిన నీవు కూడా తన ప్రబంధాలనే స్తన్యాన్ని ఇచ్చి, మా సంసారమనే రోగాన్ని లేకుండా చేస్తున్నావు. ఇది వింతల్లో వింత కదా. అటువంటి గోదాదేవీ! నీవు, శ్రీరంగనాథుడు మమ్ములను రక్షించాలి.



# కృష్ణాష్టకవ్యాఖ్యానమ్ - సవ్యాఖ్యానమ్

మన పూర్వాచార్యులు నిత్యానుసంధేయాలుగా విధించిన స్తోత్రాలలో ఈ కృష్ణాష్టకం ఒకటి. ఇది శ్రీకృష్ణభగవానుని వైభవాన్ని అందంగా తెలియజేస్తున్నది. కేవలం దీని శబ్దమాత్రో–



చ్చారణ వల్ల పవిత్రత, తృప్తి సిద్ధించినా, ఇందులోని అర్థవిశేషాలను గ్రహిస్తే మనసుకు ఆనందం కలుగుతుంది కదా. అందువల్ల సంగ్రహంగా ఈ స్తోత్రంలోని విశేషాలు విన్నపింపబడుతున్నాయి. ఇందులో శ్రీకృష్ణభగవానుని స్వరూప రూప గుణ విభూతి దివ్యావతార దివ్యలీలల కీర్తనం

చేయబడడం గమనించవచ్చు. **"దేవకీపరమానందమ్"** అని ఆనందప్రదత్వం చెప్పబడింది. **"వసుదేవసుతమ్"** అని అన్ననందున **"అజాయమానో బహుధా విజాయతే"** అని శ్రుతిలో కీర్తింపబడిన భగవదవతారకీర్తనం చేయబడింది. **"కంసచాణూరమర్దనమ్"** అని అన్ననందున దుష్టనిగ్రహరూపమైన లీలాప్రస్తావన చేయబడింది. **"అతసీపుష్పసంకాశమ్"** ఇత్యాదిగా దివ్య-మంగళవిగ్రహవర్ణనం చేయబడింది. **"చతుర్భుజమ్"** అన్నందున చతుర్విధపురుషార్థప్రదత్వం సూచింపబడింది. **"శ్రీనికేతనమ్"** అని అన్ననందున లక్ష్మీవిశిష్టత్వం చెప్పబడింది. **"ఉత్ఫుల్లపద్మ-పత్రాక్షమ్"** అని అన్నందున దయావాత్సల్యాది గుణవిశిష్టత్వం సూచింపబడింది. ఈ విధంగా ఈ స్తుతి విశిష్టాద్వైత సిద్ధాంతంలోని పలు అంశాలను ప్రతిపాదిస్తున్నది.



### 1) వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్,
### దేవకీపరమానందం కృష్ణం వందే జగద్గురుమ్.

వసుదేవుని కుమారుడు, తల్లి అయిన దేవకీదేవికి ఆనందాన్ని కలిగించేవాడు, కంసుడు, చాణూరుడు మొదలైనవారిని సంహరించినవాడు, జగద్గురువైన శ్రీకృష్ణుని నమస్కరిస్తున్నాను.

**(వసుదేవసుతమ్):** వసు–గొప్ప నిధి. వసుదేవుడు – నిధిని పొందినవాడు, నిధిని కలవాడు. వసుదేవుడు, దేవకి పొందిన సాటి లేని నిధి కదా శ్రీకృష్ణుడు. పుట్టిన వెంటనే ఆ నిధిని కోల్పోయి, చాలా కాలం తరువాత తిరిగి ఆ నిధిని పొందినట్లు వారి చరిత్ర తెలుపుతున్నది. దేవదేవస్వరూపాన్ని దర్శింపజేస్తూ జన్మించిన శ్రీకృష్ణుని చూచి, అతని తల్లిదండ్రులైన దేవకీవసుదేవులు పొందిన ఆనందాన్ని పరమానందం అని అనడం చాలా యుక్తం.

**(వసుదేవసుతం దేవమ్):** "దివు—దీప్తౌ" ధాతువునుండి పుట్టిన దేవశబ్దానికి, 'ప్రకాశించే–వాడు' అని అర్థం కనుక, వసుదేవసుతుడై పుట్టినందున ప్రకాశించేవాడు అనే అర్థాన్ని ఈ రెండు విశేషణాలు, ఈ కలయిక ద్వారా స్ఫురిస్తున్నది. ఇక్కడ **"స ఉ శ్రేయాన్ భవతి జాయమానః"** అని అంటూ వేదం, భగవంతుడు అవతారాలను ఎత్తినపుడే అతనికి అంతకు ముందు లేని శోభ కలుగుతుందని చెప్పిన అర్థం స్ఫురింపజేయబడుతున్నది.

(దేవమ్): **"శాదు శనత్తై నలియుమ్ కంజనై చ్చాదిప్పదఱ్కు ఆదియమ్ శోదియురువై అంగువైత్తు ఇంగు ప్పిఱంద"** (సత్పురుషులను బాధించేవాడైన కంసుని సంహరించడంకోసం తన అప్రాకృత మైన రూపాన్ని పరమపదంనుండి గ్రహించి, ఈ లోకంలో అవతరించిన దేవదేవుడు) – (తిరువాయ్ మొழி—3—5—5), **"విల్లెరు విழవుమ్ కంజనుమ్ మల్లుమ్ వేళముమ్ పాకనుమ్ వీళచ్చెఱ్ఱవన్"** (ధనుర్యాగం, కంసుడు, మల్లులు, కువలయాపీడం అనే ఏనుగు, మావటివాడు అనే వీరందరిని నశింపజేసినవాడు) (తిరుమొழி— 2—3—1) అని ఆழ్వార్లు కూడా కంసుని, చాణూరముష్టికులనే మల్లయుద్ధ వీరులను సంహరించిన వృత్తాంతాన్ని అనుసంధించారు.

**(దేవం కంసచాణూరమర్దనమ్):** "దివు —క్రీడాయామ్" అనే ధాతువు నుండి పుట్టిన దేవశబ్దానికి ఇక్కడ "అవతరించి లీలలను చేసేవాడు" అని అర్థం గ్రహించవచ్చు. అపుడు శ్రీకృష్ణభగవానుడు ఎందువల్ల దేవశబ్ద వాచ్యుడు అవుతున్నాడు అనే ప్రశ్నకు "కంసచాణూర మర్దనమ్" అనే విశేషణం సమాధానం పలుకుతున్నది. దుష్టుడైన కంసుని, చాణూరముష్టికులనే మల్లయుద్ధవీరులను సంహరించడం అనే లీలను ప్రదర్శించినవాడు కనుక, దేవుడు అయినాడు అనే భావం ఇక్కడ ఈ రెండు పదాల యోజనద్వారా స్ఫురిస్తున్నది.

**(కంసచాణూరమర్దనం దేవకీపరమానందమ్):** శ్రీకృష్ణ భగవానుడు భగవద్గీత తన అవతార ప్రయోజనాలను గురించి తెలియజేస్తూ, **"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్"** అని అంటూ సజ్జనులను రక్షించడం, దుష్టులను శిక్షించడం అనేవి తన అవతార ప్రయోజనాలు అని అన్నాడు. ఇక్కడ **"కంసచాణూరమర్దనమ్"** అని అనడంచేత దుష్టశిక్షణ ,

**"దేవకీపరమానందమ్"** అని అనడంద్వారా శిష్టరక్షణ తెలియజేయబడ్డాయి. అందుచేత, ఈ రెండు విశేషణపదాలు దేవశబ్దంచేత చెప్పబడిన అవతారంలోని ప్రయోజనాలను సూచిస్తున్నాయి.

**(దేవకీపరమానందం కృష్ణమ్):** శ్రీకృష్ణభగవానుని అవతారం కేవలం దేవకీదేవి ఆనందంకోసమేనా? అని అంటే, అంతమాత్రమే కాదు, జగత్తును అంతటినీ ఆనందింపజేయడంకోసం భగవంతుడు కృష్ణుడై అవతరించాడు అనే అర్థవిశేషం కృష్ణశబ్ద ప్రయోగంద్వారా స్ఫురిస్తుంది. **"కృషిః భూవాచకః శబ్దః ణస్తు నిర్వృతివాచకః, కృష్ణః తద్భావయోగాచ్చ"** అనే కృష్ణశబ్దనిరుక్తిని ఇక్కడ అనుసంధించాలి.

**(వసుదేవసుతం దేవం కంసచాణూర మర్దనం దేవకీపరమానందమ్):** మథురానగరంలో కారాగార గృహంలో వాసుదేవునకు కుమారుడై జన్మించిన వృత్తాంతం **"వసుదేవసుతమ్"** అనే పదం ద్వారా, ఆ తరువాత రేపల్లెకు చేరి, అక్కడ అత్యద్భుతమైన, అతిమానుషమైన లీలలను ప్రదర్శించిన వృత్తాంతం **"దేవమ్"** అనే పదంద్వారా, తరువాత మధురకు వచ్చి, కంసుడు, చాణూరముష్టికులు, కువలయాపీడం, మావటివాడు మొదలైనవారిని సంహరించిన వృత్తాంతం **"కంసచాణూరుమర్ధనమ్"** అనే పదం ద్వారా, ఆ తర్వాత దేవకీ వసుదేవులను చేరి, తన దివ్యమంగళ రూపాన్ని వారికి దర్శింప చేసి, వారిని ఆనందింపజేసిన వృత్తాంతం **"దేవకీ పరమానందమ్"** అనే పదం ద్వారా, ఆ తర్వాత నరకాసురుడు, బాణాసురుడు, శిశుపాలుడు మొదలైన దుష్టులను సంహరించి, కురుక్షేత్ర సంగ్రామాన్ని నిర్వహించి, దుర్మార్గులను నశింపజేయడం ద్వారా భూభారాన్ని తొలగించి, లోకానికి ఆనందాన్ని కలిగించిన వృత్తాంతం **"కృష్ణమ్"** అనే పదం ద్వారా, కురుక్షేత్ర యుద్ధంలో ఆరంభంలో అర్జునుని నిమిత్తంగా చేసికొని, సకల ఉపనిషత్తుల సారమైన భగవద్గీతను ఉపదేశించిన వృత్తాంతం **"జగద్గురుమ్"** అనే పదం ద్వారా వ్యక్తమవుతున్నందున ఈ శ్లోకం శ్రీకృష్ణావతారవైభవాన్ని సంగ్రహంగా తెలుపుతున్నదని చెప్పవచ్చు.

**(కృష్ణమ్):** నల్లనివాడు. నల్లని రంగును కలవాడు. దేవకికి కుమారుడై అవతరించినప్పుడు పెట్టిన పేరు ఇది అనే విషయం ప్రసిద్ధం. కృష్ణుడు అనేది భగవంతుని అనేక నామాలలో

ముఖ్యమైనది. ఆనందానికి స్థానమైనవాడు, సృష్టి మొదలైన లీలలతో ఆనందించేవాడు, కృష్ణావతారంలో పదహారు వేలమంది కన్యలతో కలసి ఆనందించినవాడు — అనే అర్థాలను చెప్పవచ్చు. భూమిని ఆనందింపజేసినవాడు — అనే అర్థాన్ని కూడా ఈ నామానికి తెలుపుతారు. **"మణ్ణిన పారమ్ నీంగుదత్కే వడమదురై ప్పిఱందాన్"** (తిరువాయ్ మొ*ழி*—9—1— 10) (భూభారాన్ని తీర్చడంకోసమే ఉత్తరమధురలో జన్మించాడు) అని ఆ*ழ్వా*ర్లు అర్థాన్ని తెలిపారు. భూమికి భారంగా ఉండేవారు ఎవరంటే — కంసుడు, శిశుపాలుడు, దుర్యోధనుడు మొదలైన చెడ్డ బుద్ధి కలవారు. **"నిలమంగై తుయర్ తీర్ త్తుయ్య ప్పారతత్తుళ్ ఇవరిత్తరశర్ తడుమాఱ ఇరుళ్ నాళ్ పిఱంద అమ్మాన్"** (తిరుమొ*ழி*—8—8—9) (భూదేవి దుఃఖం తీరడంకోసం భారతయుద్ధంలోని ప్రభువులందరూ కలత చెందేటట్లు చీకటివేళలో పుట్టిన స్వామి) అని తిరుమంగై ఆ*ழ్వా*ర్లు అన్నారు. భూమికి రక్షకుడు అని దీనివల్ల తెలుస్తున్నది. గోవిందనామ శబ్దార్థం కూడా ఇదే.

(**జగద్గురుమ్**): గురువు అంటే అజ్ఞానానమనే అంధకారాన్ని పోగొట్టే ఆచార్యుడు అని అర్థం. ఈ ప్రయోగానికి ఇంకా అనేక అర్థాలు ఉన్నాయి. ఆదిగురువై మొదట అవతరించివాడు అని కూడా అర్థం. **"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై"** (ఎవడు బ్రహ్మను సృష్టి ఆరంభంలో పుట్టించి, అతనికి వేదాలను ఉపదేశం చేశాడో) అని వేదం కూడా భగవంతుడైన శ్రీ కృష్ణుని జగద్గురువుగా పలికింది. కృష్ణుని బాల్యలీలలలో మొదటి లీల పూతనావధ. ఆమె తన స్తన్యానికి పూసికొన్న విషాన్ని **"విడప్పాలముదా అముదు శెయ్ దిట్ట మాయన్"** (తిరువాయ్ మొ*ழి*—1—5—10) (పూతన ఇచ్చిన విషంతో కూడిన పాలను అమృతంగా ఆస్వాదించిన, ఆశ్చర్యకరమైన లీలలను కలవాడు) ఇతడే. **"స్తన్యం తత్ విషసం–మిశ్రం రస్యమాసీత్ జగద్గురోః"** (జగద్గురు అయిన ఆ బాలకృష్ణునకు విషంతో కలిసిన స్తన్యం మధురమైనది) అని హరివంశంలో వ్యాసభగవానుడు కూడా పూతనా సంహారసందర్భంలో జగద్గురుశబ్దాన్ని ప్రయోగించారు. అందువల్ల ఈ విశేషణం పూతనావధను సూచిస్తున్నది అని చెప్పవచ్చు. **"విడనంజ ములై శువైత్త మికు ఞాన చ్చిఱుకు*ழ*వి"** (విషంతో కూడిన స్తన్యాన్ని ఆస్వాదించిన, గొప్ప జ్ఞానాన్ని కలిగిన చిన్న బాలుడు) అని నమ్మా*ழ్వా*ర్లు కూడా పూతనా

సంహారసందర్భంలో గురుశబ్దార్థాన్ని అనుసంధించారు. **"అకల్ ఇూాలత్తవర్ అఱియ నెఱి యెల్లామెడుత్తురైత్త నిఱై ఞానత్తొరు మూర్తి"** (తిరువాయ్ మొழி–4–8–6) (విశాలమైన ఈ ప్రపంచంలోని వారందరరు తెలిసేటట్లుగా శాస్త్రంలోని సారాన్ని అంతటినీ ఉపదేశించిన సంపూర్ణజ్ఞానస్వరూపుడు) అని శ్రీకృష్ణుని సకలవేదసారమైన గీతాశాస్త్రాన్ని ఉపదేశించిన జ్ఞానమూర్తి అయిన జగద్గురువుగా కీర్తించారు. అర్జునుని వ్యాజంగా చేసికొని, సకలోపనిషత్ సారమైన భగవద్గీతను విశాలమైన ఈ ప్రపంచంలో ఉండేవారంతా గ్రహించేటట్లు ఉపదేశించిన జగద్గురువు శ్రీకృష్ణుడే. ఈ గీతాశాస్త్రంలోని సారం **"మామేకం శరణం వ్రజ"** అనే సూక్తి. "నీవు వరించిన ఆచార్యుడనై, శాస్త్రాన్ని అంతటిని ఉపదేశించిన నన్ను శరణు పొందు" అని అన్నాడు, శ్రీకృష్ణుడు. అందువల్ల జగద్గురువు శ్రీకృష్ణుడే.

(**వందే**): **"వది– అభివాదన స్తుత్యోః"** అనే ధాతువునుండి పుట్టిన ఈ క్రియారూపంవల్ల కాయికమైన, వాచికమైన ప్రపత్తి తెలుపబడినా, అవి మానసిక ప్రపత్తికి కూడా ఉపలక్షణం. త్రికరణాత్మకంగా ఆశ్రయిస్తున్నాను – అని అర్థం. దీనివల్ల జగదాచార్యసమాశ్రయణం తెలుప-బడింది. శ్రీమన్నారాయణుడే కదా పరమగురువు.

## 2) అతసీపుష్పసంకాశం హారనూపురశోభితమ్,
## రత్నకంకణకేయూరం కృష్ణం వందే జగద్గురుమ్.

అగిసెపువ్వుతో పోలిన నల్లని తిరుమేనిని కలవాడు, తిరుమేనిలో తగిన చోట్ల హారాలు, నూపురాలు, మణులు పొదిగిన కేయూరాలు, కంకణాలు మొదలైన అందమైన ఆభరణాలతో వెలిగేవాడు, జగద్గురువైన శ్రీకృష్ణుని నమస్కరిస్తున్నాను.

**(అతసీపుష్పసంకాశమ్):** అగిసె పువ్వు రంగుతో పోలిన వర్ణంతో శ్రీకృష్ణుడు శోభిల్లే విషయాన్ని దివ్యసూరులు దివ్యప్రబంధాలలో పలు చోట్ల కీర్తించారు. **"కాయామలర్ వణ్ణన్"** (2–5–2) అని పెరియాళ్వార్లు, "**కాయావణ్ణన్**" (1–8) అని గోదాదేవి, **"మా కాయామ్**

**పూంగొళ్ మేని"** (తిరువాయ్ మొழி–8–10–10) అని నమ్మాழ்వార్లు కీర్తించడం గమనించ-వచ్చు.

కేవలం కొద్ది క్షణాలలో తన శోభను కోల్పోయే లౌకికమైన ఒక పువ్వును భగవంతుని దివ్యదేహానికి ఉపమానంగా పలుకడం తగునా? ఉపమానం అనేది అధికగుణాన్ని కలిగినదై ఉండాలని ఆలంకారిక సంప్రదాయం కదా! – అని అంటే, ఇక్కడ చెప్పిన ఉదాహరణ శ్రీరామాయణంలో వాల్మీకి మహర్షి శ్రీరామచంద్రుని గుణాలను వర్ణిస్తూ **"గుణైః దశరథోపమః, సముద్ర ఇవ గాంభీర్యే, ధైర్యేణ హిమవానివ"** ఇత్యాదిగా లౌకికమైన ఉదాహరణలను పలికినట్లే, ఇది కూడా అని భావించాలి. ఆ విధంగానే ఈ స్తోత్రంలో తరువాత కనిపించే పలు ఉదాహరణలను సమన్వయం చేసుకోవాలి. **"ఓదువార్ ఓత్తెల్లామ్ ఎవ్వులకత్తు ఎవ్వైయుమ్ శాదువాయ్ నిన్ పుకళిన్ తకైయల్లాల్ పిఱిదిల్లై"** (లోకంలో నిన్ను గురించి చేసే స్తుతులన్నీ నీ సంబంధంచేత అవి సార్థకతను పొందుతున్నాయి తప్ప, అవి నీ వైభవాన్ని పూర్తిగా వర్ణించ గలిగినవి కాదు) అనే నమ్మాళ్వారుల సూక్తి స్మరణీయం.

పాదాలలో నూపురాలు, కడియాలు మొదలైవి, వక్షఃస్థలంలో వనమాల, ముత్యాల మాలలు, రత్నాల హారాలు మొదలైనవి చేతులలో రత్నాలు పొదిగిన బాహువలయాలు, చేతి వలయాలు మొదలైన ఆభరణాలు ఇక్కడ తెలుపబడ్డాయి.

**(శోభితమ్):** ఆభరణాలవల్ల ఇతడు శోభిస్తున్నాడా?, లేక, స్వామి తిరుమేనిలో ఉన్నందున అవి శోభిస్తున్నాయా? అని అంటే, ఇక్కడ ఆభరణాలకు స్వామియే శోభను కలిగిస్తున్నాడు అని చెప్పాలి. స్వామి **"ఆభరణస్యాభరణం ప్రసాధనవిధేః ప్రసాధనవిశేషః"** అన్నట్లు అలంకారాలకే గొప్ప అలంకారంకదా. భగవంతుడు అలంకరించుకునే ఆభరణాల వైచిత్రిని, బహుత్వాన్ని భగవద్రామానుజులు శరణాగతి గద్యలో **"కిరీటమకుటచూడ వతంస మకరకుండల గ్రైవేయకహారకేయూరకటక శ్రీవత్సకౌస్తుభ ముక్తాదామోదరబంధన పీతాంబర కాంచీగుణ-నూపురాది అపరిమితదివ్యభూషణ"** – అని చాలా వివరంగా పలుకడం గమనించవచ్చు. **"నిరతి–**

**శయసుగంధ నిరతిశయసుఖ స్పర్శ నిరతిశయౌజ్జ్వల్య"** అని ఈ ఆభరణాలు అన్నీ విశేషించి చెప్పబడ్డాయి. గొప్ప పరిమళాన్ని కలిగినవి, తిరుమేనిని ఒరసుకోకుండా మృదువుగా, ప్రకాశాన్ని కలిగించేవిగా ఉన్నాయి ఈ ఆభరణాలు.

**"అతసీపుష్పసంకాశమ్"** అనే విశేషణం ద్వారా దివ్యమంగళవిగ్రహశోభ, ఆ దివ్యమంగళ విగ్రహానికి ఉండే మార్దవం, లావణ్యం, సౌందర్యం, సౌగంధ్యం మొదలైన గుణాలు తెలుపబడ్డాయి. అందుచేత ఈ విశేషణం శ్రీకృష్ణభగవానుని దివ్యరూపాన్ని వర్ణిస్తున్నది. **"హారనూపురశోభితం, రత్నకంకణకేయూరమ్"** అని అనడంవల్ల అనేక విధాలైన దివ్యాభరణాలు చెప్పబడ్డాయి.

3) **కుటిలాలకసంయుక్తం పూర్ణచంద్రనిభాననమ్,**
**విలసత్కుండలధరం కృష్ణం వందే జగద్గురుమ్.**

గుండ్రని ఆకారాన్ని కలిగిన, అందమైన ముంగురులను కలవాడు, పూర్ణచంద్రుని పోలిన ముఖమండలాన్ని కలవాడు, చెవులలో గొప్పగా వెలిగే మకర కుండలాలను అలంకరించు–కొన్నవాడు, జగద్గురువు అయిన కృష్ణుని ఆశ్రయిస్తున్నాను.

**(కుటిలాలకసంయుక్తమ్) "వండినమ్ పోల్ శురుండు ఇరుండ కుழల్"**(పెరియాழ్వార్ తిరుమొழி–3–6–9) (తుమ్మెదల గుంపువలె గుండ్రంగా, నల్లగా ఉండే కేశపాశం) అని పెరియాழ్వార్లు శ్రీకృష్ణుని ముంగురుల అందాన్ని వర్ణించారు.

**(పూర్ణచంద్రనిభాననమ్) "శందిరన్ పోల్ ముకత్తాన్"** అను గోదాదేవి తన ప్రబంధంలో శ్రీకృష్ణుని ముఖం చంద్రునితో పోలినది అని అనగా, పెరియాழ్వార్లు **"ఎత్తనై శెయ్యిలుమ్ ఎన్ ముకమ్ నేరొవ్వాయ్...అంబులీ!"** (చంద్రా! ఎంత నిన్ను సంస్కరించినా నీవు నా కుమారుని ముఖంతో సాటి రావు) అని యశోదాభావనతో శ్రీకృష్ణుని ముఖానికి చంద్రాధిక్యాన్ని పలికారు.

**(విలసత్కుండలధరమ్) "మిన్ను మణిమకరకుండలంగళ్ విల్ వీశ"** (తిరువాశిరియమ్) (ప్రకాశించే, మణులు పొదిగిన మకరకుండలాలు కాంతిని వెలువరించగా) అని నమ్మాళ్వార్లు, **"తాళ్ న్దిలంగు మకరమ్ శేర్ కుழை"** (తిరునెడుందాండకమ్) (చెవులకు వేలాడుతూ ప్రకాశించే మకరకుండలాలు అని తిరుమంగై ఆళ్వార్లు భగవంతుని కుండలాల కాంతిని వర్ణించారు.

## 4) మందారగంధసంయుక్తం చారుహాసం చతుర్భుజమ్,
## బర్హిపింఛావచూడాంగం కృష్ణం వందే జగద్గురుమ్.

తన తిరుమేనిలో మందార పూల పరిమళాన్ని కలవాడు, అందమైన మందహాసాన్ని చేసేవాడు, నాలుగు చేతులను కలవాడు, కిరీటంలో నెమలిపించాన్ని ఆభరణంగా ధరించినవాడు, జగద్గురువైన శ్రీకృష్ణుని నమస్కరిస్తున్నాను.

(**మందారగంధసంయుక్తమ్**) దేవతరువు అయిన మందారవృక్షానికి పూచిన పూవు దివ్యమైన పరిమళాన్ని కలిగి ఉంటుంది. తన ఇచ్ఛతో స్వీకరించిన, అప్రాకృతమైన రూపం కనుక శ్రీకృష్ణ భగవానుని రూపం దివ్యపరిమళాన్ని కలిగి ఉంటుంది. దానికి తోడు దివ్యమందార పూల పరిమళం కూడా కలిస్తే ఇక చెప్పవలసినది ఏమున్నది?

(**చారుహాసమ్**) **"నిన్ ముకవొళి తికళ ముఱువల్ శెయ్ దు"** (తిరువాయ్ –6–2–9) (నీ ముఖకాంతి ప్రకాశించేటట్లు చిరునవ్వు నవ్వి) అని నమ్మాళ్వార్లు పలికిన విధంగా కన్యలను తన వశం చేసికొనే ఉపాయం ఈ చిరునవ్వు. కన్నెలనే కాదు, అందరిని మైమరపించే సాటి లేని మేటి ఆయుధం ఇది. **"తాసామావిరభూత్ శౌరిః స్మయమానముఖాంబుజః...సాక్షాత్ మన్మథమన్మథః"** (ఆ గోపికల ముందు శ్రీకృష్ణుడు చిరునవ్వుతో కూడిన, తామర పువ్వంటి ముఖాన్ని కలిగినవాడై, అందువల్లనే సాక్షాత్తు మన్మథుని మనసును కూడా మథించేవాడై ఆవిర్భవించాడు) అని కదా ఋషివాక్కు.

**(చతుర్భుజమ్)** భగవంతునకు రామకృష్ణాది మనుష్యావతారాలలో నాలుగు భుజాలు ఉన్నాయా? అని అంటే, ఉన్నాయి అనేదే వాస్తవం. శ్రీకృష్ణ భగవానునకు జన్మించినప్పుడు ఉన్న

రూపం కదా ఇది. **"ఉపసంహార సర్వాత్మన్ రూపమేతత్ చతుర్భుజమ్"** అని కన్నవారు ప్రార్థించినందున ఆ రూపాన్ని మరుగుపరిచాడు, అంతే. శ్రీకృష్ణుడు తన తోటి బాలకులతో ఆటలు ఆడేటప్పుడు, తన చేతులతో శంఖచక్రాలను ధరించిన చతుర్భుజ రూపాన్ని వారికి చూపించి, వారిని భయపెట్టిన వృత్తాంతాన్ని పెరియాழ்వార్లు **"అమ్మనే అప్పూచ్చి కాట్టుకిన్డ్రాన్"** అనే సూక్తిద్వారా వ్యక్తం చేశారని మన పూర్వాచార్యులలో ఒకరైన గోవిందభట్టర్ తెలిపారు. అర్జునుడు విశ్వరూప దర్శనసందర్భంలో **"కిరీటనం గదినం చక్రహస్త మిచ్ఛామి త్వాం విశ్వరూపం తథైవ, తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో! భవ విశ్వమూర్తే"** అని చతుర్భు-జాలతో కూడిన రూపాన్ని దర్శించడానికే ఇష్టపడ్డాడు. నమ్మాழ்వార్లు కూడా **"నాన్గు తోళన్ కుని శార్ ఙ్గన్ ఒణ్ శంగదైవాళాழியాన్** " (తిరువాయ్—8—8—1) అని చతుర్భుజాలలో శంఖ-చక్రాలను కలిగిన భగవంతుని రూపం తమ హృదయంలో వేంచేసి ఉన్నదని అన్నారు.

**(బర్హిపింఛావచూడాంగమ్) "మయిల్ తళై ప్పీలి శూழ்"** (పెరుమాళ్ తిరుమొழி—6—9) అని కులశేఖరాழ்వార్లు, **"పీలి త్తళైయై పిణైత్తు"**(పెరియాழ்వార్ తిరుమొழி—3—6—1) అని పెరియాழ்వార్లు శ్రీకృష్ణుడు తన కిరీటంలో నెమలి పింఛాన్ని అలంకరించుకున్న అందాన్ని స్తుతించారు.

5) ఉత్ఫుల్లపద్మపత్రాక్షం నీలజీమూతసన్నిభమ్,
యాదవానాం శిరోరత్నం కృష్ణం వందే జగద్గురుమ్.

అప్పుడే వికసించిన తామరపువ్వు రేకుతో పోలిన , విశాలమైన నేత్రాలను కలవాడు, వీటిని నిండుగా తాగిన మేఘంవలె అందమైన రూపాన్ని కలవాడు, యాదవకులానికి శిరోమణివంటివాడు, జగద్గురువైన శ్రీకృష్ణుని నమస్కరిస్తున్నాను.

పుండరీకాక్షత్వం భగవంతుని లక్షణాలలో ఒకటి. దీనిని ఛాందోగ్యోపనిషత్తు **"తస్య యథాకప్యాసం పుండరీకమేవ మక్షిణీ"** అని తెలిపింది. ఈ సూక్తిని భగవద్రామానుజులు వేదార్థసంగ్రహంలో **"గంభీరాంభః సముద్భూత సుమృష్ట నాళ రవికరవికసిత**

**పుండరీదళామలాయతేక్షణః"** (లోతైన నీటిలో పుట్టినది, చాలా బలమైన కాడను కలిగినది, సూర్యుని కిరణాల వల్ల వికసించినది అయిన తామరపువ్వు యొక్క రేకువలె విశాలమైన నేత్రాలను కలవాడు) అని వివరించారు. **"జితం తే పుండరీకాక్ష"** అని వేద పురుషుని, **"గోవింద పుండరీకాక్ష"** అని భక్తురాలైన ద్రౌపదిని, **"కిమర్థం పుండరీకాక్ష"** అని విరోధించిన దుర్యోధనుని – ఈ విధంగా అందరిని లోబరచుకున్న గొప్పదనం పుండరీకాక్షత్వానికి ఉన్నదికదా.

**(నీలజీమూత సన్నిభమ్)** నీటిని నిండుగా తాగిన మేఘం నల్లగా ఉంటుంది. శ్రీ కృష్ణుడు నల్లనివాడు కనుక అటువంటి మేఘం ఇక్కడ ఉపమానంగా చెప్పబడింది. ఈ రెండింటి మధ్య ఉండే సామ్యాన్ని గోదాదేవి తిరుప్పావై ప్రబంధంలో **"ఆழிమழைక్కణ్ణా!"** అనే పాశురంలో కీర్తించారు. తిరుప్పాణ్ అழ్వార్లు **"కొండల్ వణ్ణనై"** అని అన్నారు ఇటువంటి దివ్యసూరిసూక్తులు చాలా ఉన్నాయి.

**(యాదవానాం శిరోరత్నమ్) "ఆయర్ కులత్తినిల్ తోన్ఱుమ్ అణివిళక్కై"** (గోపాలకులంలో అవతరించిన మణిదీపం) అని గోదాదేవి శ్రీకృష్ణుని ఒక మణిదీపంగా వర్ణించింది. కులశేఖరాழ్వార్లు ముకుందమాలలో **"భక్తాపాయ భుజంగ గారుడమణిః"** అనే శ్లోకంలో శ్రీకృష్ణుని "గోపాలచూడామణిః" అని అన్నారు. నమ్మాழ్వార్లు కూడా తిరువాయ్ మొழి ప్రబంధంలో **"ఆయర్ కులత్తై వీడుయ్య త్తోన్ఱియ కరుమాణిక్కచ్చుడర్"** (6–2–10) (గోపాలకులం తరించేటట్లు అవతరించిన, నీలమణికాంతివంటి కాంతిని కలవాడు) అని మణిసామ్యాన్ని అనుసంధించారు.

### 6) రుక్మిణీకేళిసంయుక్తం పీతాంబరసుశోభితమ్,
### అవాప్తతులసీగంధం కృష్ణం వందే జగద్గురుమ్.

నడుములో ధరించిన పసుపు పచ్చని పట్టువస్త్రంతో ప్రకాశించేవాడు, తన ప్రియమహిషి అయిన రుక్మణీదేవితో విహరించేవాడు, తులసీమాల సుగంధం వీచే తిరుమేనిని కలవాడు, జగద్గురువు అయిన శ్రీకృష్ణుని నమస్కరిస్తున్నాను.

**(రుక్మిణీకేళిసంయుక్తమ్) "రాఘవత్వేఽభవత్ సీతా రుక్మిణీ కృష్ణజన్మని"** అని శ్రీవిష్ణుపురాణం శ్రీకృష్ణావతారంలో లక్ష్మీదేవి రుక్మిణిదేవిగా అవతరించిందని తెలిపింది. శ్రీకృష్ణుడు రుక్మిణిని పరిణయమాడిన వృత్తాంతం హరివంశం, శ్రీవిష్ణుపురాణం, భాగవతం మొదలైన పురాణాలలో ప్రసిద్ధం. **"ఉరుప్పిణి నంగై అణినెడుంతోళ్ పుణర్ న్దాన్"** (తిరువాయ్ మొழி–7–10 –6) (రుక్మిణీదేవి అందమైన, పొడుగైన బాహువులను సంశ్లేషించాడు) అని నమ్మాళ్వార్లు, ఇంకా పలువురు ఆழ்వార్లు రుక్మిణీదేవితో శ్రీకృష్ణుడు ఆనందించిన లీలను ప్రస్తావించారు.

**(పీతాంబరసుశోభితమ్)** "**తస్య మహారజనం వాసః"** అని వేదం కూడా పీతాంబరం ధరించడం పరమాత్మ లక్షణంగా పేర్కొంది. **"అరై చ్చివంద ఆడైయిన్ మేల్ శెన్దదామ్ ఎన్ శిందైనైయే"** (శ్రీరంగనాథుని నడుములో ఉండే ఎర్రని పీతాంబరంపై నా మనసు వెళ్ళింది) అని పీతాంబరశోభను తిరుప్పాణ్ అழ்వార్లు "అమలనాది పిరాన్" ప్రబంధంలో స్తుతించారు. **"పెరుమానరైయిల్ పీతకవాడై కొండు ఎన్నై వాట్టమ్ తణీయ వీశేరే"** (నాచ్చియార్ తిరుమొழி–13–1) (శ్రీకృష్ణస్వామి నడుములో ధరించిన పీతాంబరంతో విసరి, నాకు కలిగిన ఈ ఆర్తిని తీర్చండి) అని గోదాదేవి, **"పీతకవాడై పిరానార్ పిరమ గురువాకి వందు"** (పెరియాళ్వార్ తిరుమొழி–5–2–8 ) (పీతాంబరాన్ని ధరించిన స్వామి పరమాచార్యుడై వచ్చి) అని పెరియాழ்వార్లు ఈ విధంగా పలువురు ఆழ்వార్లు స్వామి పీతాంబరాన్ని ధరించినపుడు ప్రకాశించే వైలక్షణ్యాన్ని పలు విధాలుగా అనుభవించి కీర్తించారు.

**"పీతాంబరసుశోభితమ్"** అనే ఈ విశేషణంద్వారా నీలవర్ణంలో మెరిసే కటిభాగంలో బంగారు వన్నెను కల పీతాంబరాన్ని అలంకరించడం చేత, కటి భాగంలోని నీలవర్ణం,

పీతాంబరంలోని ఎఱ్ఱని వర్ణం – అనే ఈ రెండు వర్ణాల కలయికచేత ఏర్పడిన పరభాగశోభ సూచింపబడింది. **"పీతాంబరధరః స్రగ్వీ సాక్షాన్మన్మథమన్మథః"** అని పరాశర మహర్షి శ్రీ విష్ణుపురాణంలో పీతాంబరశోభతో శ్రీకృష్ణ భగవానుడు మన్మథుని మనసును కూడా మథిస్తున్నాడని అన్నారు. శ్రీపరాశర భట్టర్ కూడా శ్రీ రంగరాజస్తవంలో **"అంచితకటీసంవాది–కౌశేయకమ్"** అని కటిభాగ పీతాంబరాల కలయికలోని శోభను వర్ణించారు. ఇది అంతా **"సుశోభితమ్"** అనే పదంద్వారా ధ్వనిస్తున్నది.

**(అవాప్తతులసీగంధమ్)** భగవంతుడు ఎన్ని ఆభరణాలను ధరించినా అవి తులసీమాలకు సాటి రావు. తులసిని ధరించడం పరమాత్మకు అసాధారణ లక్షణంగా చెప్పబడుతున్నది. అన్ని సమయాలలోను పరమాత్మ దీనిని విడువకుండా ధరిస్తాడు. చివరకు ప్రళయకాలంలో మఱ్ఱి ఆకుపై శయనించి ఉండే ఈ సన్నివేశంలో కూడా స్వామి తులసిని ధరించి ఉన్నాడు. ఈ విషయాన్ని నమ్మాళ్వార్లు తిరువాయ్ మొழி ప్రబంధంలో **"పాలనాయ్ ఏழுలగుండు .. ఆలిలై అన్నవశమ్ శెయ్యుమణ్ణలార్ తాళిణై మేలణి తణ్ణంతుழாయ్"** ( చిన్న బాలుడై ఏడు లోకాలను భుజించి... మఱ్ఱి ఆకుపై స్వామి శ్రీ చరణాలపై అలంకరించుకొన్న చల్లని, అందమైన తులసి) అని అంటూ వర్ణించారు. తులసి చేసే సర్వదేశ సర్వకాల సర్వావస్థలలోని కైంకర్యాన్ని కూడా నమ్మాళ్వార్లు **"తోళిణై మేలుమ్ నన్ మార్బిల్ మేలుమ్ తాళిణై మేలుమ్ తణ్ణమ్ తుழாయ్ ముడి అమ్మాన్"** (1–9–7) (రెండు బాహువులలో, అందమైన వక్షస్సులో, రెండు పాదాలలో, శిరస్సులో తులసిని కలిగిన స్వామి) అని కీర్తించారు. ఈ విధంగా ఎల్లప్పుడు తులసిని కలిగినవాడు స్వామి.

### 7) గోపికానాం కుచద్వంద్వకుంకుమాంకితవక్షసమ్,
### శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వందే జగద్గురుమ్.

గోపికల వక్షఃస్థలంలోని కుంకుమతో ముద్రింపబడిన వక్షస్సును కలవాడు, లక్ష్మీదేవికి నివాసమైనవాడు, విలుకాండ్రలో గొప్పవాడు అయిన శ్రీకృష్ణుని నమస్కరిస్తున్నాను.

**(గోపికానాం కుచద్వంద్వకుంకుమాంకితవక్షసమ్)** రేపల్లెలోని గొల్లకన్యలను సదా సంశ్లేషించి ఆనందించేవాడు కనుక, శ్రీకృష్ణ భగవానుని వక్షఃస్థలం ఆ కన్యలు తమ హృదయాలలో అలంకరించుకున్న కుంకుమతో ముద్రింపబడుతుంది. ఈ విధంగా కుంకుమముద్రలతో ఆ స్వామి వక్షస్థలం ప్రకాశిస్తున్నది. **"కొత్తలర్ పూంకుழల్ నప్పిన్నై కొంగైమేల్ వైత్తు క్కిడంద మలర్ మార్బా"** (గుత్తులు గుత్తులుగా వికసించే పూలను తన కేశాలలో కలిగిన నీలాదేవి వక్షఃస్థలంపై శయించినందున ఆనందంతో విస్తరించిన వక్షఃస్థలాన్ని కలవాడా!) అని తిరుప్పావైలో గోదాదేవి శ్రీకృష్ణుడు నీలాదేవి వక్షస్సును ఆలింగనం చేసికొన్న ఈ విషయాన్ని కీర్తించడం మిగిలిన గోపికల విషయంలోకూడా అన్వయిస్తుంది. అందువల్ల, మిగిలిన గోపికల హృదయాలలో అలంకారంగా అలంకరించుకొన్న కుంకుమ స్వామి వక్షస్సుపై ముద్రింప-బడడంలో ఆశ్చర్యం లేదు. ఇది అంతా భక్తుల విషయంలో భగవంతునకు ఉండే ఆదరానికి గుర్తు. పరమభక్తురాండ్రు అయిన గోపికల గాఢమైన ప్రణయభావంతో రంజింపజేయబడిన చిత్తాన్ని కలవాడు, శ్రీకృష్ణుడు — అనే అర్థం ఇక్కడ ధ్వనిస్తున్నది. గోపికలు తమ హృదయాలలో కుంకుమను అలంకరించుకోవడం అంటే శ్రీకృష్ణభగవానుని విషయంలో భక్తిని కలిగి ఉండడమేకదా.

**(శ్రీనికేతనమ్) "విష్ణోః శ్రీరనపాయినీ"** (లక్ష్మీదేవి విష్ణువును విడవకుండా సదా వెన్నంటి ఉంటుంది) అని విష్ణుపురాణం చెప్పిన రీతిలో, **"అకలకిల్లేన ఇఱైయుమెన్ఱు అలర్ మేల్ మంగై ఉఱై మార్బా!"** (ఒక్క క్షణం కూడా విడిచి ఉండి ఉండలేను – అని అంటూ సదా లక్ష్మీదేవి నివసించే వక్షఃస్థలాన్ని కలవాడా!) అని నమ్మాழ్వార్లు పలికిన రీతిలో భగవంతుడు లక్ష్మీదేవికి నిత్యనివాసం కదా. అందువల్ల శ్రీకృష్ణుడు శ్రీనికేతనుడు.

**(మహేష్వాసమ్) "విల్పెరువిழవుమ్ కంజనుమ్ మల్లుమ్ వీழ"** (తిరుమొழி–2–3–1) (గొప్ప ధనస్సును, కంసుని, మల్లయుద్ధవీరులను సంహరించినవాడు) అని తిరుమంగై ఆழ్వార్లు శ్రీకృష్ణుడు కంసుని గొప్ప విల్లును సంహరించినవాడు — అని అన్నారు కదా.

## 8) శ్రీవత్సాంకం మహోరస్కం వనమాలావిరాజితమ్,
## శంఖచక్రధరం దేవం కృష్ణం వందే జగద్గురుమ్.

తన విశాలమైన వక్షఃస్థలంలో శ్రీవత్సమనే పుట్టుమచ్చను గుర్తుగా కలవాడు, వనమాల అనే ఆభరణంతో గొప్పగా ప్రకాశించేవాడు, శ్రీసుదర్శన శ్రీపాంచజన్యాలనే శంఖచక్రా–లను ధరించిన దేవుడు, జగద్గురువైన శ్రీకృష్ణుని నమస్కరిస్తున్నాను.

**(శ్రీవత్సాంకమ్)** శ్రీకృష్ణుని విశాలమైన వక్షస్థలం శ్రీవత్సమనే పుట్టుమచ్చతో అందంగా ప్రకాశిస్తుంది. భగవంతుని వక్షస్సులో ఉండే శ్రీవత్సమనే పుట్టుమచ్చ యొక్క అందాన్ని తిరుప్పాణ్ ఆ*ழ*్వార్లు "అమలనాది పిరాన్" ప్రబంధంలో **"తిరువారమార్బు అదన్రో అడియేనై ఆట్కొండదే"** (శ్రీవత్సమనే పుట్టుమచ్చతో అలంకరింపబడిన శ్రీరంగనాథుని వక్షస్సు నన్ను వశీకరించుకొన్నది) అని కీర్తించారు.

**(మహోరస్కమ్)** ఇటువంటి శ్రీవత్సంతో, వనమాలతో, లక్ష్మీదేవితో విరాజిల్లే వక్షఃస్థలం కలవాడు కనుక స్వామి మహోరస్కుడు. అనేక ఆభరణాలకు నిలయం అయినందున స్వామివక్షస్సు గొప్పగా ప్రకాశిస్తున్నది. **"కైక*ழ*లా నేమియాన్"** (చేతిలో సుదర్శనాన్ని కలవాడు), **"కైక*ழ*లా ఒణ్ శంగత్తాన్"** (చేతిలో ప్రకాశించే అందమైన పాంచజన్యాన్ని కలవాడు) అనే విధంగా తన చేతులలో నిత్యం ధరించే దివ్యాయుధాల కాంతి ప్రసరించడంవల్ల కూడా స్వామివక్షస్సు గొప్పగా వెలుగుతున్నది.

**(వనమాలావిరాజితమ్)** **"వనమాలై మినుంగునిన్రు విళైయాడ"** (నాచ్చియార్ తిరుమొ*ழ*ి –14–2) (వనమాల ప్రకాశిస్తూ ఊగగా) అని గోదాదేవి, **"మంగల నల్ వనమాలై మార్బిలలంగ"** (పెరుమాళ్ తిరుమొ*ழ*ి–2–1) (మంగళకరమైన గొప్ప వనమాల వక్షస్సులో వెలుగుగా) అని కులశేఖరా*ழ*్వార్లు వనమాల వలన కలిగిన శోభను కొనియాడారు.

**(శంఖచక్రధరమ్)** శ్రీకృష్ణుడు శంఖచక్రాలు ధరించిన అందాన్ని పలువురు ఆళ్వార్లు అనుభవించారు. ఉదాహరణకు పెరియాళ్వార్లు **"నేమియుమ్ శంగుమ్ నిలావియ కైత్తలంగళ్"** (1–2–12) (చక్రాన్ని, శంఖాన్ని ధరించిన కరతలాలు) అని కీర్తించారు.

**(శంఖచక్రధరం దేవమ్) "దివు–దీప్తౌ"** అనే ధాతువు నుండి పుట్టిన దేవశబ్దానికి ప్రకాశించేవాడని అర్థం. శంఖచక్రాల కాంతితో శ్రీకృష్ణభగవానుడు ప్రకాశించే సన్నివేశాన్ని ఇక్కడి దేవశబ్దం సూచిస్తుంది.

**(శ్రీవత్సాంకం...దేవమ్)** శ్రీవత్సంతో, వనమాలతో, శంఖచక్రాలతో ప్రకాశించే సన్నివేశాన్ని దేవ శబ్దం తెలుపుతున్నదని కూడా చెప్పవచ్చు.

9) **కృష్ణాష్టకమిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్,**
**కోటిజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి.**

తనను స్తుతించేవారికి వారు కోరిన ప్రయోజనాలను కలిగించేది, కృష్ణాష్టకం అనే ఈ గొప్ప స్తోత్రం. దీనిని ఉదయకాలంలో లేచి నిత్యం అనుసంధించేవారికి లెక్కలేనన్ని జన్మలలో చేసిన పాపాలన్నీ వెంటనే నశిస్తాయి.

ఴఴఴఴఴఴఴఴఴఴఴ